# ఋతుగా[illegible]



E. V. Vyas.

ఎం. కృష్ణమాచార్య
(ఆంధ్ర సాహిత్య మండలి)

# సమర్పణ.

శ్రీరమ పుట్టినిల్లగుచు సేమముగూర్చెడి తెల్గుతల్లి సొం
పారెడు సున్మయాననము పావనచిత్తమునందు నిల్పి, నా
కోరికఁదీర్ప మా ప్రకృతి కోమలిఁ గొల్చి యఖండభక్తితోఁ
బూరణఁజేయు కావ్యమునఁ బూజయొనర్తును గన్నతల్లికిన్.

అన్నిటికన్న మిన్నగద! యమ్మకు బిడ్డలయందుఁ బ్రేమ! యే
సన్నుతి దానినిం దెలుపఁజాలును? మానవమాత్రులందునన్
సన్నుతమైన మా జనని స్వాంతమునందలి ప్రేమ నిస్తులం
బెన్నిటికైన జన్మలకు నీయమకే జనియింపఁగోరెదన్.

కన్న ఋణంబు దీర్చుకొనఁ గాదనుమీ! యిది యెంతమాట! నా
సన్నుత కావ్యపుష్పములు చాలవు వందలు వేలు తల్లి; ఇం
కెన్నటికైన జన్మలకు నిల్లె ఋణంబును దీర్పలేను, నీ
కన్నకుమారులందరను గాంచుము ప్రేమరసార్ద్ర వీక్షలన్.

చెలియలికట్టలేని త్వదశేషమహత్తరప్రేమసాగరో
త్కలితములౌ తరంగములఁ గానఁగలేను, పరీమళాస్పదం
బిలను త్వదీయమౌ విమల హృత్కమలంబు, మదీయకావ్యముల్
నరగున నీ కొసంగుటలు చంద్రునకిచ్చెడి నూలుపోగులే.

మాతవు - సద్గుణోన్నతి సమంచితుఁజేయఁగ నెంచు వేళలన్
మాతవు - బాల్యమందెపుడొ మన్పిన భాగవతాన పద్యముల్
త్రాతలు నాకు నో జననీ! ధన్యుఁడ నీయెడఁబాటువేళలన్
వేతపియించి పాడుకొని నిన్ను స్మరింతును వాని వెల్గులన్.

—ఎ. కృష్ణమాచార్య.

# INTRODUCTION

BY

Sir C. Ramalinga Reddy, Kt., M.A, (Cantab) Hon., D.Litt.,
Vice Chancellor,

I have cursorily gone through the "RUTU-GANAM" by E. Krishnamacharya, one of the very few books in our literature that are entirely devoted to a description of the seasons. There is a poem called "The *Seasons*" in the English language by Thompson and there is the great classic of Kalidasa, the "Rutu Samhara", Krishnamacharya's book is an attempt on those lines and by no means an unworthy attempt.

The author is a young boy reading in the IIIrd B. A. Honours class in the department of Telugu of the Andhra University, Even absolutely the book is noteworthy; but when one considers the youth of the poet, it must be regarded as a work of remarkable merit and of yet more remarkable promise for the future, The University is proud that it has within its ranks a poet of the calibre of Krishnamacharya,

The poet has an extensive command of vocabulary, a fine fancy and an imagination of no mean order, The style is engagingly classic. It is a matter for gratification that he has not become a victim of slovenly modernisms in language or in thought, He has the gift of similes and metaphors, and of pathetic fallacy (Utpreksha) with occasional recourse to Slesha,

I am proud of this lad in our University and wish that he may have a long life devoted to literature,

Andhra University,
WALTAIR,
D/1st March, 1947,

C. R. REDDY,
*Vice-Chancellor.*

# ఆశీస్సు

సంతోషింపఁగఁ జేసె నీ కవిత ప్రజ్ఞావంతు శ్రీ రెడ్డి సా
మంతున్ విశ్వకలాలయాధిపతి శ్రీ మ్రామలింగాఖ్యు, మా
యంతేవాసి కులంబు వన్నెఁగనె వత్సా! కృష్ణమాచార్య! వా
క్కాంతారత్నము వాణి నీదు రసనాగ్రంబందు నర్తించుతన్.

స్వాంతముపేర నొప్పెనఁగు చక్కని పూవులతోఁట వింతగా
వంతులఁగూర్చి పద్యసుమవల్లుల భావపరీమళంబు న
శ్రాంతముఁ జిమ్ము నవ్యఋతుషట్కసుమంబుల మాతృదేవతన్
సంతసమొప్పఁ బూజనము సల్పితి ధన్యుఁడవోయి శిష్యుఁడా!

ఋతుసంహారముఁ గాళిదాస కృతి సారెన్ జ్ఞప్తికిందెచ్చు నీ
ఋతుగానంబు సువర్ణభూషణము గాదే యాంధ్రభాషా కళా
పతికిన్, దీన ననర్ఘరత్నములు గుంఫంబుల్ శరచ్చంద్రికా
స్రుతి శోభావహములున్ సుభావములు శిష్యుండా! శుభంబయ్యెడున్

ఇట్లు,

పల్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులు,
సంస్కృతాధ్యాపకులు,
హిందూ కళాశాల, గుంటూరు.
8—3—47.

# ఆశీస్సు

శా॥ కాళిదాసుఁడు మున్ను షడ్రుతువులన్ కావ్యంబునంగూర్చి నా
నాలంకారవిరాజమానమగుచున్ హర్షేందు చందంబునన్
మేలంచెంచఁగజేసె నవ్విధమునన్ శ్రీఎక్కిరాలాన్వయ
ప్రాలేయాంశుఁడు కృష్ణుడాంధ్రమున సంపాదించెనయ్యర్థమున్

చ॥ అతఁడు పురాణకల్పనలనాఋతుషట్కము ప్రస్తరించె ము
న్నితఁడు నవీనకల్పనల నెల్లరు మేల్భళిరేయనంగ ను
న్నతములు శ్రోత్రపేయములనంతవిలాస విశేష సంగతుల్
జతపడ గావ్యరాజమును సల్పెకళాకుశలత్వమేర్పడన్

చ॥ శ్రుతికిహితప్రకారమయి శోభిలు భావములన్ గ్రహించి సం
చితమగు సృష్టివైభవము చెన్నలరారుచు భావగోచర
స్థితిగలుగంగ గానమునుజేసెనువాసిగఁగాలరూపమై
ఋతువులు నాఁదలిర్చు పరమేశ్వరు వైష్ణవకృష్ణుఁడల్పుడే

చ॥ ఒకఁడయి యేదురూపముల నొప్పెడుగాలిని గృష్ణమార్యుఁడీ
సుకృతిని నాఱుగానలిపి సొంపలరారఁగ విస్తరించెఁ గొం
చకసలప్రపంచమటు చల్లగ చల్లగ మార్పుజెందుటల్
వికృతముగాని చందమున విజ్ఞుఁడయై వివరించె నెంచఁగన్

మ॥ జగమున్ గానముసేయఁగల్గె నిటు విష్వక్సేన సేవాసమా
శ్రితగతిం గృష్ణుఁడు ఎక్కిరాలకులరత్నం బద్ధిలోకైక భా.
వగమై శబ్దమయ ప్రపంచమున విశ్వశ్రేయముం గూర్చుచున్
దగపెంపొందెడునంచు శ్రీపధుఁడు కృష్ణబ్రహ్మ వాక్రుచ్చెడున్

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# పీఠిక

ఋతువర్ణన మహాకవులై చేయనివారులేరు. వాల్మీకి, కాళిదాసు కృష్ణరాయలు, రవీంద్రనాధుడు, యీ పాయా కవులందరు ఋతుశోభ చూచి పొంగివ్రాసినవారే, కాని ప్రత్యేకముగా ఋతువులను గురించి యొక గ్రంథరూపముగా వ్రాసిన వారిసంఖ్యకొద్ది. దానికి మొదటివాడు కాళిదాసు. కాళిదాసు ఋతుసంహారము బాల్యములో వ్రాసెనందురు. గ్రంథము చూచినచో నిజమేననిపించును. శృంగారరసము తత్తదృతు సంభవ పుష్పసంపద్వర్ణన జేసెను. కాళిదాసు గొప్పతోటమాలి, కుసుమ ప్రియుడు, ఆయనకవిత్వమంతటితో నాగినది. తరువాత నొకటి రెండు గ్రంథములున్నవి. వానిప్రసక్తి యక్కరలేదు. ఈ చిన్నిపొత్తము వ్రాసిన చిన్నవాడు కృష్ణమాచార్యులు, శ్రీమాన్ పండిత ఎక్కిరాల అనంతా చార్యులుగారి కుమారుడు. తండ్రి బి. ఏ. ప్యాసయినవారు. ఆయుర్వేద వైద్యులు. ఆయుర్వేదవైద్యుడనగా చరక శుశ్రుతాదులు చదివి దానిని బట్టివైద్యము చేసేవాడుకాదు. వానిలోనున్న చికిత్సానిదానాలకు సాటియైన విషయములు స్వంతముగా వేదములో పరిశీలించి జోడించిచేసేవాడు. ఆయన దొకభాష్యకారబుద్ధి. ఆ తండ్రికొడుకిపిల్లవాడు. ఈ గ్రంథములో నున్న వ్యుత్పత్తి ఆతండ్రిది. ఒకమనుష్యుని బుద్ధివైశారద్యమునకు రక్తము, పెంపకము, రెండు నెక్కువపాళ్లు సహాయపడును. ఈ రెంటి యొక్క అచ్ఛగుణ సమృద్ధియు నీపిల్లవానికి గలుగుట ఆంధ్ర ప్రౌఢ సరస్వతి యొక్క అదృష్టము.

కవిత్వము పలువిధములుగా నుండవలయునని పలుమంది వాదనలు. నేడిట్టి కవిత్వము కవిత్వమే కాదనువారి సంఖ్యబహుళము. యేఅల్ప సంఖ్యాకులో విశిష్టమైన విషయమును ఆస్వాదించుదురు. వారిసంఖ్యాల్పత్వము యీవిషయము నిష్ప్రయోజకమనుటకుబాధకము కాదు. వారును సంఘములోనివారే. వారినివదలినచో సంఘముపూర్తి కాదు. ''సత్యహంలోకః'' అన్నట్లుగా నుండును.

ఒక్కవిషయముసుమాత్రి మీకుఋవాడు రుజువుచేయుచున్నాడు.

ప్రౌఢకవులునూ పుట్టుదురు. అనగా నొకానొకని మనస్సునకు ప్రౌఢి సహజము. అదితెచ్చు కొనునది ఆరోపించుకొనునదికాదు. రాజకీయము లలో మనస్సు బిగువుకలవాడు గొప్పరాజనీతివేత్త అగుచున్నాడు. అట్లే సారస్వతములో ప్రౌఢకవియగుచున్నాడు. సారస్వతములో ప్రౌఢిని నిందించువాడు లోకములోనితరవిషయములతో పోల్చియేర్పరించుకోలేని వాడు.

ఇది చిన్నకావ్యము. ఈ లోకము విమర్శించని పాఠకలోక బహుళము. నాప్రశంస అపాత్రన్యస్తమని యనివారుందురని నాకు తెలియును. వారిని వారే నిందిచుకొందురు. ఇది నిశ్చయము.

ఇది వరకువ్రాసిన యేకవియు ఋతువర్ణనమున నీస్థాయిపొంద లేదు. పొందుటసాధ్యముకాదు. ఇందనేక విషయములు వేదార్థముల నావిష్కరింపచేయును. లోక మింతవేదానభిముఖముగా పోవుచుండగా యెవడో యెక్కడోచెదురుగా తదాభిముఖ్య ప్రాగల్భమునేపెంచుకొనును. ఈ కుఱ్ఱవానికిరువది యేండ్లునిండలేదు. వాల్తేరులోతెలుగు ఆనర్సు చదువు చున్నాడు. అందరివలెనే కాలేజీలలోనే చదివినాడు. ఇతనికి బయట నేటి లోకపునడకల సంఘర్షణ జరుగుచునేయున్నది. ఇంటిలోతండ్రి వేదాభి మానమును చెప్పుచున్నాడు. తండ్రులు పండితులై పెడత్రోవలుపట్టిన కొడుకు లెందరులేరు? ఇంటిలోని సంస్కారమును పరిత్యజించి వెలి సంస్కారమును దోసిళ్లతో త్రావినవారెందరులేరు? ఈపిల్లవానికి యింటి లోని సంస్కారమే యేలబలమైనది? ఇది జీవుని లక్షణము. వేదాభి మానముకల ప్రౌఢమైన మనస్సు నీజీవుడు పూర్వజన్మలనుండి తెచ్చు కొన్నాడు. దానికిపెంపకమును పరిస్థితులను దోహదమిచ్చినవి.

కవిత్వమనుటతోడనే భావములేకాదు. పద్యరచన, చెప్పెడితీరు ఇవికూడనున్నవి, ఇవిమూడును ఒకొక్కటి పలురకములుగానుండును.

తెల్లచీరెగట్టి తెలివెల్గులను గల్గి
సితకుముదముదాల్చు ఋతులతాంగి
దైవతంబుపాడె దైవత్యకాంతుల
సృష్టియెల్లముదము జెందుచుండ.

ఈభావముయొక్కదర్శాయెక్కడది? శాస్త్రములోనున్నపరమరహస్య విషయము. ఇది శరదృతు వర్ణనలోనిది. సప్తస్వరాలలోను ధైవతమునకు శరదృతువునకు సంబంధమును చెప్పునది. సృష్టియంతయు ధైవత్య కాంతులను చెందుచున్నదనుట. ఈ భావము ప్రకృతికిని భిన్నశాస్త్ర గతవిషయములకుగల పరస్పరసంబంధనిరూపణ. అంతరవిషయమును జూచుటయేగదా శాస్త్రదృష్టి. ఈసప్తస్వరములకు షడృతువులకు కల సంబంధ మీకావ్యమున చూడవచ్చును. ఈభావముయొక్క ఔదాత్యము వేరు. ఇదిపైపైచదువుల కందునదిగాదు.

> తపముకొఱకు గౌతముడునస్తాద్రిఁజేర
> నపుడహల్యను జరియించునట్టియినుని
> వేయిచేతులు వానికి వేయికన్ను
> లయ్యె - దేవత్వమన్ని రెట్లధికమనఁగ.

ఈ పద్యమునందలి భావమెచ్చటది? అచ్చముగా వేదమునందలిది. "అహల్యాయైజార" అన్నసందర్భములోనిది, వేదార్థముకూడభాష్యకారుని కొలదిని అగ్ని ఋక్కునకు పతంజలి భావార్థముఁ చెప్పినాడు. అరుణ ములోని యీ ఘట్టమునకు విద్యారణ్యులు వేరేఅర్థము వ్రాసినారు. ఈయనయిట్లను చున్నాడు.

ఈభావముల తరగతివేరు. యిదిపండితుల త్రోవలే అని యీస డించుటతేలిక. ఇది శాస్త్రజ్ఞుల పరిశీలనయని తెలిసుకొనుట కష్టము. శాస్త్రమనగా సైన్సు అని తెలిసికొనలేక పోవుటవలన.

> "పృథ్వితోఁ బనిలేక బిడ్డలంగనుచుండు
> రణపాలమని యెడు రశ్మిభోక్త"

ఇదివర్షఋతువులోనిది. ఈభావము ప్రకృతి పరిశీలనమునుండి వచ్చినది. అందులోకొంత వైద్యునికుమారుడగుటచేత వచ్చినది. రణపాల చెట్టు బదనిక, భూసంసర్గములేనిది, శివలింగపుష్ప వృక్షమువంటిది. దానిని యింతఅందముగా చెప్పుట ఇదియొక గొప్పభావము. పైనచెప్పిన రెండుభావములకంటె తక్కువభావము. దీనియంతట దీనిని చూచినచో తక్కువ భావముకాదు. పోల్చిచూచినచో తక్కువభావము.

"నెలనాళ్లు నిద్రలోనిలచి సీతాకోక
పులుగైన గొంగళిపురుగొకండు."

ఇదిఅందరకు తెలిసెడు ప్రకృతివిషయము.

తరువాత, లోకమందరు కవిత్వమనుకొను కొన్నిభావములు చూపింతును. చంద్రుని వర్ణించుచు "గగనదీర్ఘికమొలచిన కలువ పూవు" అనుటయొకటి

"గగనముడెనువై మెలఁగఁగా పాదుగొశశినుండి పాలుగారగ"
ఈ అలంకార మెట్లున్నది.

చెంగుచెంగున వీథులఁజెంగలించి
వాలమెత్తిపర్వెత్తు గోవత్సములను
గోవులుత్కంఠమునఁ బిల్చుకొనుచునుండె
సుఖములకు బిడ్డలేమౌదురోయటంచు.

యేమిమధురమైనకల్పన "బిడ్డలేమౌదురోయటంచు అన్నదానిలో యేమాట యెక్కడవేసిన భావపుష్టి గలుగునో తెలిసిచేసినపని. ఈరీతిగ పిల్లవాడు లోకమందరు కవిత్వమను కొను సామగ్రి నెరుగనివాడుకాడు. సహజముగనుదాత్తవీథుల సంచరించు మనః ప్రవృత్తికలవాడు.

ఈకావ్యమునందు వేదవిషయములు వైద్యవిషయములు కావ్యమునకు తగినన్నియున్నవి. అన్నిటికన్న మరీ చిత్రము.

అన్నిదిక్కులందు వినతమగుచునొప్పు
నాకసము భూమి కలసినయట్టిచోటు
అట్టివినతగర్భమునందుఁ బుట్టినాడు
పైడిఱెక్కలఁవేలుపు భానుడొచు.

ఈపద్యమును దీనితరువాత రెండుపద్యములును, యిదియేదో వేదకాలపుటాత్మ, తన సనాతనత్వము నిలుపుకొనుటకు జన్మించినట్లున్నది.

ఇంతకంటె విచిత్రము. అరుఋతువులయొక్క పరమరహస్యము హేమంతములోనున్నది. ఈ గ్రంధమున పెంచివ్రాయబడిన వానిలో హేమంతమొకటి. ఈ హేమంతమేమిటి అను ప్రశ్నకు 29 పుటలో మొదటిమూడుపద్యములు చదువవలయును. అపుటలోనే చివర రెండు

పద్యములు నక్షత్రములనుగూర్చి చెప్పుచున్నవి. బ్రాహ్మవేళయందు భూపాల భావమునంది పవనరూపులై నక్షత్రములు పాడుచున్నారట. ఓహో! తెలుగు పద్యము, లౌకికభాషయు నిగళములైనవిగాని, యిదియొక బుక్కు. యెంతవ్రాసినను వ్రాయవచ్చును. ఈ గ్రంథమును చదువుటకు కావలసిన భావుకత్వముకలవానికి నావ్రాసిన మాటలు యాథార్థ్యమునకు కించిదూనములనిపింపవచ్చునుగూడ. తక్కిన వారిప్రసక్తి లేదు.

చివరకొకమాటచెప్పెదను. యెన్నిభావములైన నుండవచ్చును యెన్నికల్పనలైన చేయువచ్చును. పద్యరచనయందు యేభాషలోనైనను ఆకవికి ఒక తీర్చినబాటయేర్పడి అమార్గమున నది వ్యవధినొందినది కావలయును. అప్పుడే ఆకవిత్వము రాణించును. లేనిచో ఒకశాస్త్రగ్రంథము వంటిదగును. పద్యరచనలో మనపూర్వులు పలుమార్గము లువేసిపోయినారు. కొన్ని ప్రౌఢములు, కొన్నిసుకుమారములు, కొన్ని మధురములు, ఆ యా మార్గములుకూడ నా యాకవులకు జీవలక్షణమునుబట్టియే కుదురును. మధురసుకుమారాది సులభమార్గములలో ధామేదాతనము కుదిరినంత తేలికగా ప్రౌఢమార్గములో కుదురదు. ప్రౌఢమార్గమునందు నవధిచేరుట పరమాభ్యాస వశప్రాప్యము. ఇతనికి ప్రౌఢిమార్గము చాల దూరమువచ్చి నది. అందందు కొంచము పనదుత్తనముప్పది. అభ్యాసము వదలడు. పరమమైన స్థితిని పొందగలడు.

దీర్ఘాయురస్తు

శతాయుఃపురుషశ్శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతి తిష్ఠతి,

విశ్వనాథ సత్యనారాయణ



ఆశ్యులారా !

బాల్యోచిత మగు నా యుల్లాస మీ పద్యరూపముల దాల్చినది. ఇవి నా యాటపాటలు. వాటిని పాడి పెద్దలయాశీర్వాదముల నపేక్షించుట నా బాల్యచాపల్యము.

నిరంతరము లగు సృష్టి సౌందర్యములు బాలురకు నూతనములై యానందదాయకము లగుచుండును. పగటియందు గలుగు సూర్యోదయాస్తమయాది వైభవములును, రాత్రుల గానవచ్చు చంద్రతారకలును పిన్నల మనముల నెక్కుడుగ నాకర్షించును. షడృతువుల యందలి సూర్యచంద్రుల వివిధవికాసములును, భూమ్యాకాశాంతరిక్షముల సంచరించు కృమి కీట పశు పక్ష్యాదుల యవస్థాభేదములును మానవుడు వీక్షించి తన సుఖ దుఃఖానుభవములను వాటికిగూడ నారోపించి వాటికి తనతో బాంధవ్యమును గూర్చుకొనుచుండును. ఇట్లే పర్వతములు, నదులు, పువ్వులు, తీవలు మొదలగునవి యన్నియు మానవునికి బంధువులై మహదానంద మొసగుచు జీవితమును రసవంతముగా నొనర్చును. ఇట్టి ఋతుశృంగారముల నీ పద్యములయందు స్తుతించితిని.

పగటికాలము నందలి ప్రాతర్మధ్యందిన సాయం విభాగములవలెనే రాత్రినిగూడ త్రికాలవిభాగము జేసి యహోరాత్రము లందలి యాఱు కాలములకు సంవత్సరమునందలి యాఱుఋతువులకును సామ్యమును కల్పించుకొని ఋతుగానమును జేసితిని.

వ్యక్తము గాబోవు శబ్దమునకు, శ్రుతి యాధారమున ప్రథమస్వరముత్పత్తియై యందుండి మిగిలిన యాఱు స్వరములును క్రమముగ వెలువడుటచే ప్రథమ స్వరమునకు షడ్జయనునామము గలదు. అవ్యక్త షడ్జావస్థను హేమంతకాల మధ్యమావస్థ యందలి రాత్రిగను, ఋతువులాఱింటిని వ్యక్తమగు షట్స్వరములుగను ధ్యానించి ఋతుగానమున నిమిడ్చితిని.

ఈ నా పద్యములను ప్రేమతో విని సంతసించి ప్రచురింప ప్రోత్సహించి పీఠికల నొసగిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారికిని, శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారికిని, నా యందు శిష్యవాత్సల్యము నుంచి పద్యములనుసవరించి తమ యాశీస్సులనొసగిన శ్రీ:వల్లెపూర్త ప్రజ్ఞాచార్యులవారికిని, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికిని నేను కృతజ్ఞతా పూర్వక వందనముల నర్పించుకొనుచున్నాడను.

ఇట్లు విధేయుడు,

ఎ. కృష్ణమాచార్య.

# వి శ్వ గా న ము

వేకువ నిద్రమేల్కొలిపె విశ్వవినూత్న నిషాద నమ్మిల
త్ప్రకట షడ్జరావము, ధరాతలమందున జీవకోటియున్
చీకటినుండి మేల్కొనెను, చెట్లును బచ్చని నీరుటెండతో
వేకువఁజూచి మేల్కొనెను విశ్వగుహాంతరు గానవాహినిన్

దీపిత గానమాధురికి దీపితమై తపనీయతాప సు
స్నాపితమయ్యె భూమి, గగనాంతరవీథిని చండభానుచే
తాపముఁగల్గఁజేసినది తద్స్వరగానము, గ్రీష్మవాయువుల్
దీపితమయ్యె నాతఁడు యథేచ్ఛముఁ గానముఁజేయు వేళలన్

ఉన్నత పర్వతేరుగుహనుండి మహత్తర గానవాహినిన్
సన్ననిధారగా మురళి నందుల నొక్కఁడు ఫాలవెల్లిగాఁ
బన్నిన గోపబాలకుఁడు పాడుచునుండె దినాంతవేళఁ జై
త్యోన్నత పుష్పపల్లవము లుద్ధతితో దలలెత్తి చూడఁగన్.

చల్లనిగాలిలో గలసి సంచలనం బొనరించు గాన మా
పల్లపు దేశమందుఁగల పల్లెలనుండిన గోపికాజనం
బెల్ల వినంగ, వారిసలరించి మనంబుల లాగుచుండె, గ్రే
పల్లెను నిల్చి విందురెటువైపుననుండియొ గాంచలేర హో

శ్యామక గానవైఖరి వశంబునఁ జీకటిగ్రమ్ముచుండె, నా
రామములున్ వనంబులును రమ్యవినూతన హర్మ్యజాలముల్
శ్యామ నిశీథివారిధి విశాలజలంబుల మున్గిపోయెడిన్
మోమున శ్యామచిహ్నముల మోవుచు భానుఁడు నిద్రకేగఁగన్

ఆ వినిపించుగానము గృహంబుల నిల్చిన గోపబాలకుం
డే వినిపించుచుండె నని యెంతురు గోపికలంతెగాని, లో
కావహుఁడైన బిడ్డఁడు మహాచలసీమను, నిల్చి లోకముల్
గావఁగఁ బాడుచుండె నని గాంచఁగఁజాల రదేమి చిత్రమో.

భానుఁడు గ్రుంకునంతకునుఁ బర్వతపంక్తులనున్న యావులా
మానితవేణుగాన మతి మానుషమంచును, గాతశాశ్వతుం
డౌనని, కొండపై నిలిచి యున్నిజగంబుల బ్రోవఁజేయు నా
గాన మనంతమంచెఱుఁగుఁ గాని యికేరికి స్పష్టమౌనొకో.

అతఁడొక గోపవేషమున నంతయుగాంచుచు రాధతోడ, భా
సితమృదువేణుగాన రససిక్తముఁ జేయఁగ బొంగె లోకముల్
సతతము షడ్జరావమును సామవిధిఁ గొని శిష్టషట్క్రమా
యతముగఁ బాడఁగా ఋతువులారును వెల్వడు సారెసారెకుఁ.



# వసంతము

సతతోల్లాస వసంతశోభనలు విశ్వంబందుఁబొంగారె నీ
క్షితియెల్లన్ నవవర్ణపుష్పముల నిశ్శేషంబుగాఁ దాల్చె, జీ
విత సందేశమొసంగఁ గోకిలలు సంప్రీతాత్ములై హాయిగా
నతులానందతరంగ డోలికల రాగాలాపముల్ చేసెడిన్.

ఆ రాగంబున మున్గియున్న యది యుద్యత్ప్రాణసంస్పందనం
బై రాజిల్లెడి యక్షరంబు వడి నిద్రాలంబనావస్థితిన్
ఘోరాకారము దాల్చు భూజములకున్కుంబాపి నవ్వించు లో
కారాధ్యంబగు విద్య లోకముల నిత్యంబైన ప్రశ్వాసమై

సంశయంబేల కోకిల శ్వాసలోని
రాగములకల్లదే యనురాగపౌచు
మోడుమ్రాకుల సలనల్ల మొలకలెత్తె
రాగసంపద్ప్రాణ సంరంజకముగ.

నవ సర్గోద్యమకారణంబులు కపోష్ణంబుల్ సహస్రాంశు సం
భవ జీవాంశుల దీప్తులయ్యెను స్వయంవ్యక్తంబులై యొప్పు మా
ధవ కాలోద్భవ మందవాయువులు హృద్యంబుల్ ధరాకన్యకుం
గవచోద్దీప్త వసుంధరాత్వమిడగా గర్వంబు గల్పించెడిన్.

కోకిల గానముల్ వినుచుఁ గోమలపుష్ప సుగంధమానుచున్
మ్రాకుల నెక్కి దూకుచుఁ గ్రమంబున బూవులఁదాల్చు మస్తముం
దాకెడు వా యురూపి ఋతునాయకు మాధవుఁ జెల్మిచేష్టకున్
ఏ కనుఁజెందు మాలతులు వేడుకమైఁ దలవంచు సిగ్గునన్.

## వ స ం త ము

నవనవోజ్జ్వల సౌమ్యధవళ నేత్రములతో
బసివన్నెయాకుల పైటతోడఁ
బ్రణవవాసితనవ భ్రమరవేణికలతోఁ
జివురాకు నెమ్మోవి చెర్వుతోడ
సించదమృతబిందు పంచమ స్వనముతోఁ
దేటయౌ చిరునవ్వు తేనెతోడఁ
కమనీయ సుమజనిగంధ లేపనలతోఁ
జాపటఁ బుప్పొడి పనవుతోడఁ

గోర్కులిచ్చెడు మాధవుఁ గోరివలచి
వాని మన్ననఁ గొను సఖిప్రాయమంది
చూడ నే తెంచె మధుమాన శోభనాంగి
తపము ఫలియించె ననెడి నంతనము మిఱ.

నెలనాళ్లు నిద్రలోనిలచి సీతాకోక
పులుగైన గొంగళిపురుగొకండు
తుమ్మెదగానంబుతో జీవమార్జించి
కన్నము వీడెడి చిన్ని పురువు
స్వాత్మశక్తిని సహస్రాభివర్ధితఁ జేసి
ధరణినిఁ బోషించు ధాన్యరాశి
కోకిల కంఠానఁ గూజసంబును గూర్చు
క్రొమ్మావి చిరుకొమ్మ కమ్మఁ జివురు

శాస్త్రజిజ్ఞాసులకు రహస్యములఁ దెలుప
వసమ కవిరాజ కుంజరాల్ హర్షమంద
శాస్త్రపటిమకుఁ గళకును స్థానమైన
నాటియామని గులుకుచు నవ్వునవ్వె.

# వసంతము

మేల్పొడి ఱెక్కల మెఱుఁగు దీపింపఁగ
దినపతంగికిఁ గ్రొత్త తేజమలరె
గోర్వెచ్చ గాడ్పులు బర్వంగ జీవరా
సుల నాడులకుఁ గల్గెఁ జురుకుఁదనము
సుమజాత నవనీత సోమపానమ్మున
బలవత్తరంబయ్యెఁ బ్రాణలవము
వత్సరాది యని యభ్యంగనాదుల నల్ప
మానవకోటినిర్మలత నందె

శస్త్రహా స్పర్శరూప రసాదులకును
స్రష్టయైనట్టి శబ్దంబు షడ్జరవము
గానమొనరించును ప్రకృతి కాంత వినఁగ
నగును మందవాయువు గానమాలపింప.

మల్లెపూలను దాల్పంగ మనసు గలిగి
కురులనెందుగ ధరియించి మురియుచుండు
ముగ్ధలటు మాలతీలతల్ మురిసిపోవఁ
దాము దాల్చిన పూవులఁ దావిగాంచి.

గాలివీచిన నోఱపిడిఁ బాలుగారు
నున్నితములైన పసికాయలెన్ని యేని
గుత్తులుగ వ్రేలనూయలల్ గూర్చుకొనియెఁ
బిల్లలం గన్న తల్లులు వేపచెట్లు.

మాధవుని రాజ్యమందున మనసుదీర
విహరణముసేసి యరిగెను విశ్రమింప
మాధవుని వక్షమునఁ గన్ను మలపుచుండె
మల్లికారమ యాతని మందిరమున.

## వసంతము

సుగుణసంపద మనమునఁ జొప్పడంగఁ
జాలునందము చందమ్ము లేల యనెడి
చంపకము గానరాకయ సంచరించెఁ
బ్రతిభ దాగకదశ దిశల్ బ్రజ్వలించె.

ఒక్కొక చెట్టుకొమ్మను మహోజ్జ్వల హృద్యవసంతగీతముల్
పెక్కులు పాడసాగినవి పిట్టల గుంపులు కృష్ణరాయ భూ
భుక్కుని యట్లు కోకిలలు భూరి సువర్ణ విహారభాషలో
జక్కని భావ సంపదల శ్రావ్యముగా నొసరించె వేడుకన్.

మధుఫలాస్వాది విశ్వసన్మానితుండు
మాధవుని రాజ్యమందున మహిమలెల్ల
శుకమహాకవి వర్ణించుచుండె ముద్దు
లొలుకు మాడ్కినిఁ గడుతేటపలుకులందు.

పూలఁదోటల మాధవపూజకొఱకుఁ
గలసి యొకచోట గుమిఁగూడు కాంతలకప
బంధపరివేష్టి మల్లికాపరిమళంబు
నానుచున్నది భ్రమరంబు గానరాక.

వాసనల నాని గుట్టుగాఁ బారిపాడు
వారి చెవులలో నేదియో వదరుచుండుఁ
దివిరి ప్రియులంపు ప్రేమ సందేశమేమొ
దివ్యగాంధర్వ గీతోపదేశమేమొ,

కాంత లుత్సాహమున సల్పు గానమందు
కంఠసావర్ణ్య మొక కొంత గానుపింప
గండుకోయిలల్ వారిదగ్గరకుఁ జేరు
తమ ప్రియల పిల్పులనియెడి తలపువలన.

మధువు రూపాననేగాక మధురఫలము
లందుననుగూడ మాధవుఁ డమృతరసము
మిక్కుటంబుగఁ బండించి పెక్కుగతులఁ
దనదు రాజ్యాన బ్రజలను దనుపుచుండు.

అన్నివిధంబులం గవితకారి కవీంద్రుని వాక్కుదక్కఁగా
నెన్నుచుఁ బోల్పఁదగ్గదికనెందును లేని యనన్యమాధురిన్
సన్నుతికెక్కి స్వాదులరసంబున ద్రాక్షలు పూర్తిపక్వమై
యున్నవి తీపలందున సమున్నత మోహన గుచ్ఛపంక్తులన్.

ముగుద జవరాలి పచ్చని మోముపైనఁ
గాటుక సలంకరించిన కన్నులట్లు
సల్లద్రాక్షలు పర్ణాళి నడుమ నలరు
మధుర రసభర హృదయంగమంబులౌచు.

రాజ కన్యకామోహ కారణములైన
పూర్వ వీపుల సువిభక్త భుజములట్లు
పక్వమైన ప్రౌఢ రసాల ఫల సమూహ
మమితముగఁ జెట్లనుండి వ్రేలాడుచుండె.

పనసలఁజెట్ల కొమ్మలిక భారమునోపవటంచు నెంచుచున్
గనియెడివారి కబ్బురము గల్గెడు భాతినిఁ జెంత నిల్వఁగా
మనములు భోక్తలౌ నొయన మ్రగ్గిన పండ్ల సువాసనల్ దిశల్
పెనఁగొనె మంచి వంశమున బిడ్డల కీరితి యట్లు తోటలన్.

వాయుదేవుఁడు పసిపిల్లకాయ యగుచు
నిచ్చవచ్చినరీతుల నెగురుచుండి
లేతక్రొమ్మావి చిబుకముల్ చేతబూని
యూయెలల నూచి నవ్వించుచుండె నదిగో!

యజ్ఞపూరుష సంవత్సరాధ్వరమునఁ
గలుగు ఋత్విజులైనట్టి కలరవశుక
కోకిలాదులు భ్రమరముల్ గుంపుగూడి
గాన మొనరించుచుండెను ద్గాతలగుచు.

వాని యుద్గీథ గానమే ప్రకృతియందు
వానియందును దాగిన జ్ఞానరూపు
నంగ నిహితుడై రాజిలు నగ్నిహోత్రుఁ
బిలచునాహూతి - ఋక్కుల వెలయునదియొ.

పుష్పఫలములతోఁ జెట్లు పూర్ణమౌట
హృదయమోదంబు నానాట వృద్ధిఁజెంద
గాలిదేవుఁడు పుప్పొడిం దేలియాడి
పాడుకొనఁ దొడఁగెను ఋషభస్వరంబు.



## గ్రీష్మము

యజ్ఞపూజితుఁడైనట్టి యగ్నిహోత్రుఁ
డాత్మదనియంగ విస్తృతుఁడయ్యె నపుడు
సవితయానంద ముఖవికాసములె యవని
యందుఁ దీక్ష్ణకిరణములై యావరించె.

ప్రకృతిచేఁ బురుహూతుఁడై భాస్వరాగ్ని
హోత్రుఁడు మరుద్గణముల కాహూతి సలిపె
సధ్వరంబున నెర్వేరి యాగమంబు
జీవరాసులఁ దపియింపఁ జేయుచుండె.

పటుతర దుర్నిరీక్ష్య ననివార్య కఠోరమహోష్ణతీక్ష్ణతన్
చటుల తదీయ కీల్వకరజాత మహోజ్జ్వల చండవాయువుల్
నిటలపు జిహ్వాలై తగుల నీరధినీరము మింటఁబ్రాకె, నం
కటకరతార్క్ష్య వేగమున గాసినిఁ జెందెడు సర్పముల్ బలెన్.

ఉర్విఁ బండించుచున్న కవోష్ణరసము
దినదినమ్మునుఁ జిక్కనై తీక్ష్ణమయ్యె
ముదురుటెండకు జీవులు మొగముమొత్తి
దూషణలనల్పి రప్కని ద్యుతులపైన.

లోకహితుఁడైన భాను నాలోకమందు
సృష్టియెల్ల భైషజ్యంబు సెందుచుండె
ఘనపదార్థముఁ దినరాదు, కఠినపథ్య
మపుడు నడచెను మనుజుల కందఱకును.

గ్రీష్మము

ఆతపముగాంచి తపమున కదియుకాల
మనుచు జ్ఞానులు తమ యిండ్ల యంద నిలచి
సాత్త్వికాహారసేవల జరుపుచుండి
యజ్ఞ నిష్ఠాగరిష్ఠులై యలరుచుండ్రు.

వహ్ని వదనంబునం దలిశ్వాస చయమె
వాయురూపమై లోకాలఁ బ్రబలుచుండి
శరధుల తటాకముల యందు జలములా హ
రించి యగ్నికి నిడు నూత్నసృష్టికొఱకు.

కనుగొన నొక్క మేఘమునుఁ గానగరాదు నభంబునందుఁ బృ
థ్విని నదులందుఁ దోయముగతించిన భారతభాగ్యమట్టు లే
గెను కలలోని వార్తయయి, గ్రీష్ముని రాజ్యవిలాసశోభనల్
గనసగు సైకతస్థలులఁ గల్గెడు మోసపుటెండమావులన్

వడదాకు పసిపాప వదనంబు చాడ్పునఁ
బసి గడ్డిపరకలు వాడిపోయె
క్రొత్తకుండఁ దడుపు కోమలాంగుల యట్లు
ఘర్మార్త్రసదులు మేఘుష్యులఁ దడిపె
ఆతపస్నానంబు నాచరించెటి కార్మి
కుని దేహమటు ధాత్రి కుమిలిపోయె
మృగతృష్ణలంజూచు మృగశాబమునుబోలె
కాపుబాలిక చూచె గగనతలము

భూజశిఖరానఁ గొబ్బరిపుచ్చెలట్టు
లాకసంబునఁ జిరుమబ్బు ప్రాకుచుండె
మానవుల దేహమట్టుల మహికిఁగూడ
నొడలు పేలిన దన భూమి ముడుతలయ్యె.

ఏమూలనైనను నీరు గల్గుననియో ఏమో మరుత్పాంథుఁడా
సామీప్యంబునఁ జూచి చూచి యిక విశ్రాంతంబుకై యెండలో
భూమీజోపరిపర్ణ మధ్యమున సంపూర్ణంబుగా దాగి, తా
నేమో గీతముఁ బాడుచుండె తన గొంతెండంగ శుష్కధ్వనిన్!

వాయువృద్ధాత పాడెడి పాటయందు
భైరవంబై మెలఁగు ఋషభస్వరంబు
ఘాటికీ మహీజ పర్ణముల్ తాళలేక
ధరణిపై రాలుచుండె వార్ధక్యదశను.

వెల్లివిరియు దయారస వృష్టికొఱకు
సర్వసౌందర్య సంపద సన్యసించి
మునివిచక్షునిఁ బ్రార్థించుకతన భూజ
తతులపర్ణత నందెను ధ్యానమందు.

వేపకాయలు సూర్యుని వేడికోర్చి
గిడసబారిన యటు గట్టిగింజఁబట్టి
భాసురుచి తీవ్రతకుఁ బూర్తిపక్వమంది
తిక్తతనుబాసి ఫలములై తీపిజెందె.

పవడములఁ బోలిన రసాల పల్లవములు
ముదిరి పచ్చనై పెళుసులైపోయెనంతఁ
గారణంబేమొ కోకిలకంఠ మధుర
గాన వాహిని తఱచుగాఁ గానరాదు.

నాడు మధుమాస మహిమంబుఁ బాడుకొన్న
కోకిలయె డాగె నేడు పండాకులందు,
పాటబాడదు, గొంతు విప్పారినంత
పఱతురని యేమొ గ్రీష్ముని పవనభటులు.

మఱుగుపడినట్టి తెలుఁగు సామ్రాజ్యశోభ
కథలుగాఁ జెప్పు వృద్ధుని కరణి - ముదుక
కంఠమున నప్పుడప్పుడు ఖ్యాతిఁజేయు
పూర్వ మాధవరాజ్య సంపూర్ణశోభ.

కృములు కీటక దూర్వాంకురములు మాడి
పోయె, సర్వదా స్వోదరపోషణార్థి
దేశసంచారి చీమయుఁ దిరుగలేక
మ్రుగ్గుపిండిపరిగలకుఁ బోవకుండె.

శీర్ణ తరువులు కాననసీమలందు
వహ్నిని మథింప నదియునుఁ బ్రజ్వలించి
కాలరుద్ర స్వరూపియై కాననంబు
భక్షణము సేయు ఫళఫళధ్వనులతోడ.

జలహీనంబయి రాత్రియుం బవలు నుష్ణంబైన కాంతారమం
దలి సత్వంబులు నిల్వనోప కికఁ దత్ప్రాంతంబులం బట్టణం
బులకుం బోయి జలార్థులై తిరుగఁ దస్మాలంబునం దున్న హా
జ్జ్వల తృష్ణార్తత ధేను మేష మృగహింసాకృత్యముల్ మానెడిన్.

రవి మధ్యాహ్నమునం జరించి పటుమార్తాండ ద్యుతిన్ వెల్గఁగా
భువిపై జీవులు భీతినంది సదనంబుల్ వీడిరావయ్యె, మా
నవులిండ్లంబడి సొమ్మసిల్లిరదె ప్రాణంబుల్ సుఖంబందగా
దిపమేరాతిరియయ్యె వహ్ని శిఖలుద్దీపించు గ్రీష్మంబునన్.

రవిలేని వెన్నెలరాత్రుల మేల్కాంచి
జనులు వాహ్యాళికిఁ జనెడి కతన
వడగాడ్పుదెబ్బకు భయమంది పాంథుఁడు
నిర్భీతి యానంబు నెఱపు కతన

చంద్రకాంతులలోన సంతోషమునఁ బక్షు
లార్చుచు టెక్కలల్లార్చుకతన
మల్లెపందిరిముందు మంచముల్ వాలిచి
యతిపలు ముచ్చటలాడు కతన
అర్ధరాత్రము ప్రాణులకందఱకును
రంజకంబయి యొప్పారి రాజుతోడి
దివముభాతిని వెల్గొందె - దేశమందు
జీవరాసులు సౌఖ్య సంసిద్ధినందె.

కుసుమగణముల నత్యంతకోమలత్వ
మందిన శరీషకన్యక యలపులేక
రేయిఁ బవలును దా నొక్కరీతి నిలచి
సుఖము దుఃఖము నొకటిగఁ జూచుచుండె.

విపళిత శాల్మలీవసన - వేగతరశ్వసితోష్ణదేహ - న్వం
దవమిత శుష్క నీరసనదాంతర నిర్గతకూలలంబితో
ద్విపళిత భూరిశైవల వివిక్తసుకేశియు గ్రీష్మకాంత వా
రిపరహితోరు వీక్షణనిరీతికి సంధ్యలఁ దెల్లబోయెడిన్

కరధుల జలాశయములందు జలములెల్ల
నావిరులయి గగనవీధినందుకొనఁగఁ
దరలుసిత మేఘతతుల వితానమరయు
ప్రాణులకు నెండమావులై యానగొలిపె.

కర్షకుఁడు నాగలినిఁ దాల్చ కాలమదియ
యనుచు గ్రీష్మ భూపాలుఁ "దేయుజ" యటంచు
మార్గదర్శకుఁడై తాను మసలెననఁగ
భూమియంతయు బీటలువోయెనపుడు.



## వ ర్ష ఋ తు వు

గగనమండల సమాక్రమచండవిస్తార
నవమేఘనీల సైన్యములతోడ
దండ శూకాండ భేదక భీకరారవ
స్తనితోరు భేరికా ధ్వనులతోడ
వీక్షావరోధక విద్యుల్లతాయూధ
వివిధ మారణశస్త్ర వితతితోడ
సర్వజీవ హృదయ సంతప్తదావాన
లాపహ బిందు బాణాళితోడ
శాంతినొదగూర్ప నాహవసంభ్రమమునఁ
గ్రౌర్యమతిశయించిన గ్రీష్మరాజ్యమందు
దండగమనఁబు నల్పఁగఁ దరలివచ్చె
వర్షఋతురాజు దశదిశావ్యాప్తుడౌచు.

గగనసీమను ఘన తరంగములతోడఁ
జెలఁగు రసరూపుఁ బరిజన్యశీలుఁగాంచి
స్వాగతోత్సవమున నెదురేగి నలుపు
నెమలి నాట్యము హర్షము నింపసాగె.

శలభసమూహముల్ మరియు శ్యామల కోమల ఘాసరాశి, చెం
గలువలు, గ్రీష్మతాపహరగంధిలశీతల నీరరాశియుక్
జలరుహ భూరుహంబులును జంతువులుక్ ఋతుకాంత గర్వమం
దలి కుహరానఁ దాల్చుటను నల్లనఁ జెందెఁ బయోధరంబులుక్.

మేఘపతి పాడి భువికి సంప్రీతిగూర్చి
ధారలొసఁగుచు ధాత్రిని దనుపుకతన
వర్షవేళల నింద్రుఁడు పాడినట్టి
యారవంబె లోకమున గాంధారమయ్యె.

గానమొనరించు నాకాశవాణి పాట
కర్ణములసోకినంతఁ జెంగలువమొగ్గ
తపముఁజాలించి ధవళనేత్రముల విచ్చి
యాఱునాల్క్రాల నమిత దాహమునఁ జాపె.

వర్షఋత్వాగమోల్లాస వైభవంబు
సర్వజీవుల కానందనమయమగుట
సండబద్ధులై యున్న నర్వార్భకులకుఁ
గడఁగి మోక్షమొసంగె నా గానలవమె.

చెంగుచెంగున వీథులఁ జెంగలించి
వాలమెత్తి పర్వెత్తు గోవత్సములను
గోవులుత్కంఠమునఁ బిల్చుకొనుచునుండె
నుఱుములకు బిడ్డ లేమౌదురోయటంచు.

వెలిమబ్బుంగని సంధ్యవేళలయనుచున్ బిట్టల్ మనోజ్ఞంబుగాఁ
బలుమారుల్ వినిపించుఁ గూజితములన్- వర్షాంతకాలంబులం
ధలి సౌఖ్యప్రద మందమారుతము నానందించుచుం బిల్లకా
యలు మోదంబున నల్లిబిల్లులను నాప్యాయంబుగా నాడఁగన్.

## వర్షఋతువు

తూనీగల్ గగనంబునం దిరిగె సంతోషంబుతోఁ గొంగలున్
నానా చిత్రవిచిత్ర సంగతుల సన్మార్గంబులం బోయె, న
త్యానందంబునఁ గీరపంక్తులు విహారాసక్తిచే నవ్వుచున్
నానాదిక్కులఁ బర్వులెత్తె హృదయానందంబు పెంపొందఁగన్

ప్రాలేయ గిరినుండి పయనంబు సాగించి
పురుషపుర ప్రాంతభూమిదాటి,
యానాటి హస్తిన కీనాటిదేహలి
కిని గల భేదంబులను గ్రహించి
ఘన మహారాష్ట్రభూమిని గొంత వీక్షించి
తక్కిన భూములదాటికొనుచు
ఎండవేడిమికి గొంతెండిన తెలుఁగున
జనులకుఁ జల్లనియునిలమిచ్చి
పూర్వపరిపాలనాకేంద్ర భూములిపుడు
లాంఛనార్థము దేవతాలయములయిన
యార్యభూమినిఁ బరికించి యశ్రుకణముఁ
జార్చుచున్నది తొలకరి జలదమాత.

అంబుభరమయి దినదినమంబరంబు
బరువునోపక రసరూపుఁ బ్రసవమయ్యెఁ
బచ్చికబయళ్లఁ బసిచాయ పసిమితోడ
ధరణి దేహంబు పులకించెఁ దపనవాసి.

## వ ర్ష ఋ తు వు

తొలివానచినుకులు జలజలరాలఁగా
నొకక్రొత్తగంధము ప్రకటమయ్యె
కొలదికాలములోనఁ గొటులై మిడుతలు
భూగర్భమునసుండి పొటమరించె
దివసద్వయంబున నవనిపై గ్రానంబు
పఱచు తివాచీలభాతిఁ బెరిగె
దాహతప్తములైన వాహినీ యూధముల్
క్రొత్తజలంబులఁ గ్రోలసాగె

పటువృషాకపివీర్యంబు పడినవేళఁ
ద్వరితగతితోడఁ దనదు గర్భమునఁ దాల్చి
చున్నది వసుంధరాదేవి యొక్కసారి
జీవరాసులఁ బ్రభవింపఁజేయుకొఱకు,

చిరచిరరాలినట్టి తొలిచిన్కు కపింజల పక్షినోటిలోఁ
గురిసెను - మంచుకొంతపయిఁ గూడిన నీటికి జంటజంటలై
పరుగునఁబోవుచున్నయవి పంక్తులుదీర్చి మరాళరాజముల్
తరుణముమించిపోవనిక - ద్రావఁగఁజాలవు నిర్మలాంబువుల్.

చదల నటునిటు స్వేచ్ఛగా సంచరించు
జలదధేనువుల్ భువిని జీవులకునెల్లఁ
గొల్లగాఁగ్రోలి తాము వర్ధిల్లుకొఱకు
ఘనపయోధారలఁ గురిసికొనుచునుండె.

వర్షాతిశయమున బావులందున నీరు
ప్రతిదినంబును పైకిఁ బ్రాకుచుండె
పెరటిలోఁ బాదులు పెరిగి విజృంభింపఁ
గూరగాయలకాపు కొల్లయయ్యె

నేలపైన స్థలంబు చాలదోయన గడ్డి
కుడ్యాగ్రములపైనఁగూడ నిలిచె
ఉద్యానమునకేగు నువిదలపూల సె
జ్జలు నిండి యింకను జాలకుండె

స్వల్పరిక్తభూతలమున్న చాయలంధు
నెల్లఁ గొల్లగా మొలచె శిలీంధ్రచయము
అవనియంతయు నిత్యకళ్యాణమయ్యె.
ధర వసుంధరయై ప్రాణభరితయయ్యె.

పృధ్వితోఁ బనిలేక బిడ్డలంగనుచుండు
రణపాలమనియెడు రశ్మిభోక్త
పవనవాతంబునఁ బలుచోట్ల క్షిప్తమై
వృద్ధియైనట్టి శిలీంధ్రగణము
పంచభూతంబుల బహుచిత్రమేళసం
ఘునఁ గల్గు భూనాగమనెడి జీవి
ఉపకారపరమహితోర్వీజములపైన
నివసించు బదనికానివహములును

శాస్త్రజిజ్ఞాసులకు రహస్యములఁ దెలుప
ననమకవిరాజకుంజరాల్ హర్షమంద
శాస్త్రపటిమకుఁ గళకును స్థానమైన
నాటి ఋతుకాంత కులుకుచు నవ్వునవ్వె.

మెల్లనఁ బ్రాకుచుం దన సమీపపు సైకతరేణుసంచయం
బెల్లను మ్రింగి క్రూరభువికెంతొ మృదుత్వమొసంగి సస్యముల్
కొల్లగఁ బండఁగాఁ బదనుఁగూర్చుచునున్నది వానపాము, శో
భిల్లెడు సృష్టియజ్ఞమునఁ బెంపుగ సాయముఁజేయఁగోరుచున్.

ఖలుఁడౌ గ్రీష్ముని యోటమిం గనుచు నుత్కంఠంబులన్ భేకముల్
జలమధ్యస్థ తపస్వినంతతిసహస్రంబుల్ సమావేశమై
పలుమారుల్ వినుతించెఁ గౌర్యము కృపావర్షంబుచే మంచిగా
మలుపన్నేర్చిన వర్షరాజు ఘనతన్ మాండూక్యరావమ్మునన్.

భానుకోపాగ్ని కెంతటి బాధ పడెనొ
వర్షసౌఖ్యాబ్ధి నానందభాష్పపూర్ణ
సఘునములఁ గల్వజాలిగా నవ్వుచుండె
నల్పనంతోషి యానందమధికతరము.

వెలవెలఁబారిన వెలుతురుతోడనే
దినమణిలేకయె తెల్లవారె
వల్మీకరంధ్రాళి వారి పూరములోటఁ
జీమలబారులు చెట్లనెక్కె
వృక్షాగ్రసీమను విహగంబు గూటిపైఁ
జక్కగాఁ బిడ్డకు టెక్కఁగప్పె
ధర మానవులకన్న దాతయౌ ముదికాపు
తలపైన గోనెతోఁ బొలముఁబోయె

పచ్చికబయళ్ల జల్లని పవనసౌఖ్య
మనుభవించెడి దూర్వాంకురాళి గనిన
మోద భాష్పకణంబులు ప్రొద్దుప్రొద్దు
ననె యఱుగువారు గాంచంగ ననువుపడును.

కడగి పర్జన్యలక్ష్మికిఁ గానుకొనఁగఁ
గువలయాంగన గొని తెచ్చు కుంకుమయన
గుంపులై వెలసిన యింద్రగోపగణము
కన్నులకు విందుగొల్పుచుఁ గానుపించె.

## వ ర్ష ఋ తు వు

శాంతమౌ వత్సర దినాంతసమయ మందు
తరుణపూర్ణోదయేందు దీప్తంబులైన
పసుపువన్నెల పువ్వులు మిసిమిఁజెంద
నలరుచున్నది వనలక్ష్మి యగు కదంబి.

అపరదిగ్ధాత్రి రక్తసిక్తాంగియైన
యపుడు పూర్వ దిక్శోభకం బగుచు నొప్ప
శక్రుచాపంబు మబ్బులచాటునుండి
జనుల కగుపించె చక్షురుత్సవముగాఁగ.

శ్రావణమాసమందున రజస్వలలయ్యె నదుల్, శరీరముల్
లావయి సొంపుఁజూపెను విలాసతనూభవనూత్నరాగయు
గ్యౌవనగాత్రలై ప్రియునియుండకుఁ బర్విడుచుంటఁ గన్గొనన్
భూవనితా మనస్సుమము పూచెను, చేతము పల్లవించెడిన్.



# శరదృతువు

వత్సరంబున రేయిలోఁ బ్రథమభాగ
మఖిల జీవులు మంద్రంబు ననుభవించు
పర్వకాలంబు - పృధ్వీసుపర్వయౌట
కొఱకు సోమపానము సల్పుకొనెడివేళ.

అది సోముని సామ్రాజ్యము
ప్రధితం బగు తెలిగులాబిప్రసవము విచ్చం
జదలను పువ్వులతోటను
ముదమొదవెడు సౌరభంబు భువిపై గురియన్.

జలదసమూహముల్ చదలశంఖము లట్టులఁ దెల్లనయ్యె, భూ
వలయమునందుఁ గాశములు బాగుగఁబూచెను శ్వేతపుష్పముల్
జలధిసుతుండు మింటను బ్రశాంతముగా వెలుఁగొందువేళలం
గలువలు వాని ఛాయలటుగ్రాలెను తేటకొలంకులందునన్.

తెల్లని మేఘసైకత ప్రదేశములందు నహర్నిశంబులన్
మెల్లనఁ బర్వులెత్తుచు సమీరముక్రిందకు వచ్చి, మేఘపుం
జల్లదనంబు ప్రాణులకొనంగుచు నంతనఁబైకిఁ బోవుచున్
బిల్లలయట్టులాడుచు నభీపపు మబ్బులఁ బర్వఁజేసెడిన్.

దానముచేసి బీదలగు దాతలకైవడి బేలవోయి - మం
దానిలపోతఘాతములకాగఁగఁ జాలక మేఘసంతతుల్
వానలమాని నల్దిశలఁ బర్వఁగఁ జంద్రుఁడు వానిఁబిల్చి - స
న్మానముచేసి వృద్ధులకు మక్కువనిచ్చెను రౌప్యభూషలన్.

## శ ర దృ తు వు

మానససరోవరమునుండి మరలివచ్చు
హంసలటు వేరువేరుగ నాకసమునఁ
దెల్లతెల్లని మేఘభిత్తికలు గగన
యానమొనరించుచుండె నహర్నిశంబు

అహంబులీనంబగుసట్టి రాత్రియే
యహల్య - యా స్త్రీ నలరించు గౌతముం
డహీనతేజుం డవతీర్ణుఁడయ్యెన్
మహిన్ మహానందమొసంగ వేడ్కన్.

కాద్రవేయుల కిడ సుధాఘటము గొనుచు
దివిజులను గెల్వ ఖగపతి దిగిచి వెడలె
నాఁగసోముఁడు పూర్ణిమనాఁడుతోచె
వేయిచేతుల పెనుగాపువెడలిసంత.

గగనదీర్ఘిక మొలచిన కలువపూవు
ప్రతిదినంబున కొకటియై పదియునైదు
పత్రములఁ బూర్తిగావిప్ప వరమయోగి
మనసురీతిని నిలచె నైర్మల్యమొప్ప.

అదియుసోముని సామ్రాజ్యమంటుఁ బూర్ణ
పర్వదినము - భూతలమెల్ల భాస్వదమృత
కిరణసిక్తమై శీతలతరుణకాంతు
లలర వెల్గొందెఁ బూర్ణేందు కలితమగుచు.

తన ధరాపాలనమునందు దనరియుండు
విశ్వమానవ సౌభాగ్య విధముఁగాంచఁ
గొలఁకులందున నదులలో నిలచియుండె
నవనిపతి జీవులకు మోదమలరఁజేయ.

జలనిధి వెంచి ద్రావమయి చంద్రుని రాజ్యపుటర్ధమట్లు ని
శ్చలతనుజెందె మధ్యమునఁ - జంచలనంబయి యుత్తరంగముల్
లలిత వినూత్నమౌక్తిక విలాసముఁ జూపెను గట్టులందు, నం
దలి నురుగుల్ బయల్పడె సుధాజలధిన్ మధియింప వెన్నయై.

సులలిత రూపసాంగులయి శుభ్ర వినిర్మలవారితోడ, ని
స్తులగతిఁ బోవు నావగలు చంద్రునితో విహరించువేళలం
జలువని చీరలం గలిగి పై కనుపించెడు సుస్మితంబులౌ
లలనల దేహభాగములలాగున సైకతముల్బయల్పడెన్.

నడుముపంపుల నొయ్యారి నడకలలర
నూత్నవస్త్రాల నవరాత్రి నోమువేళఁ
గలసి పేరంటమున కేగు కాంత లట్లు
నదులు ప్రవహించె గజగమనంబుతోడ.

హృదయమహీజమందు నిదురించెడు తొమ్మిదికొమ్మలందు, బల్
విధముల భావపుష్పముల విప్పగఁ జేసెడి చంద్రికానదిన్.
ముదముప్పొంగ తేలినది భూవలయంబున జీవకోటి, సౌ
ఖ్యదుఁడగు రాజు మింటను విహారము నల్పెడివేళలందునన్.

నీలిమబ్బులు పట్టిన కాలమందు
బహుళవర్ణాళి నలరిన బర్హిగణము
నింగితెలుపౌటఁ దెలుపునందినవౌ యనఁగ
వాడిబర్హిస్సు శ్వేతపుష్పములవిచ్చె.

శారదకాంత నవ్వుచుఁ బ్రశాంతనభంబున సోమకందమున్
సారముపిండుచున్నది - విశాల ధరాతలినోషధీతతుల్
తోరముగా ఫలింపఁగ - మధుస్రుతివేగఁపుధాటితోఁగళల్
మారుచునుండె సోమము - నమర్త్యతఁగూర్పఁగ మానవాళికిన్.

## శ ర దృ తు వు

మున్నొక నల్లమేని దొర - మోహనరూపుడుఁడు - వేణుగానసం
పన్నుఁడు - రాధికాహృదయపద్మము నందళియై విహార భా
గ్యోన్నతి నామెతోడ ముదమొప్పఁగ గానము జేసినట్టిదీ
పున్నమరేయియే యిపుడపూర్వముగాఁ గనుపించు గాంచఁగన్.

అమిత సుకుమార శాల్యంకురముల తలలు
దాకి, యల్లన జనియె మందపవనుండు,
కంటికగుపించె నా తరంగస్వరూపుఁ
డమలపూర్ణిమాశర్వరీ సమయమందు.

తెల్లచీరెగట్టి తెలివెల్గులనుగల్గి
సితకుముదముదాల్చు ఋతు లతాంగి
దైవతంబుపాడె దైవత్యకాంతుల
సృష్టియెల్ల ముదముజెందుచుండ.

గగనముధేనువై మెలఁగఁగాఁ ఖొదుగౌ శశినుండి పాలుగా
రఁగ నిట భూమిధేనువు కరంబుకృపన్ దన జీవకోటికిన్
దగినటు లోషధీతతులఁ దానయొసంగిన దట్లె యావులున్
మిగులగ క్షీరమిచ్చినవి మేల్మిసుధారన వృష్టియోయనన్.

తరుణ సుధాలిప్త ధావల్యకాంతులఁ
గ్రాలు రారాజు వప్రమ్ము వోలె
ఉదయాబ్ధిలో స్నానమొంది వచ్చిన శశి
బాలుస కిడెడి సాంబ్రాణివోలె
శరదృతువేళల శర్వరీకన్యక
జలకమాడెడు కల్వకొలనువోలె
శశిభాండమును జిల్కఁ జల్లచిన్కులతోడ
వెలికివచ్చెడు తెలివెన్నవోలె

నిర్మలాంబరతలమున నిదురవోవ
శశికిఁ బరచిన బహు మృదుశయ్యవోలె
ననుపమానందదాయకంబయ్యెఁ నాటి
మేటి పున్నమరేయిని మేఘపంక్తి.

గగనమనియెడు కల్పవృక్షంబునందు
పిందెయొక్కటి నానాఁట వృద్ధిఁజెంది
పదియునైదవ దినమునఁ బండిపోయి
రాలుగతిఁదోచెఁ బూర్ణిమారాత్రి గడచు
బ్రాహ్మవేళను చంద్రుండు పశ్చిమమున.

తపముకొఱకు గౌతముడు సప్తాద్రిజేఁర
నపు డహల్యను జరియించునట్టి యినుని
వేయిచేతులు వానికి వేయికన్ను
లయ్యె - దేవత్వమన్నిరెట్లధికమనఁగ.

నిన్న ప్రవహించినట్టి వెన్నెలస్రవంతి
పలుకు లౌటను ధవళపుష్పముల రూపు
ప్రాప్తమయ్యెనొ యన నప్తపర్ణితరులు
శ్వేతసుమములు విచ్చెఁ బ్రాభాతవేళ.

భానుఁడు ప్రాగ్దిశాజననివక్షమునందునఁ గెంపుచాయతో
నాననమెత్తిచూడ జలదాంగన లెట్టిని రంగుచీరలం
బూని వినూత్నబాలకుని ముద్దులఁ బెట్టుకొనంగ గుంపులై
కానఁగవచ్చుచుండి రదె కన్నులకింపుగఁ గామరూపలై.

భాసురనూత్నకాంతియుత భానుఁడు రాతిరి సోమయాగముం
జేసినవాడొ యేమొ - వికసించిన యౌవనశోభ గల్గి యు
ల్లాసమునన్ మహా కవికులాగ్రణియై ప్రియతోడ లోకముల్
భాసిలఁజేసి ముందడుగువైచి ప్రబోధముఁజేసె జీవులన్.

తనదగుదీప్తి యింకను నుదాత్తముగా సొగసుల్ కుదిర్చి, రే
యిని ననుయాయియౌట శశికిచ్చిన నాతఁడు వెల్గువెల్గె - నౌ -
ఘనులును బ్రజ్ఞపూర్ణముగఁ గల్గిన యొజ్జలఁగొల్వ శిష్యుఁడుణ
ఘనతనుజెంది వెల్గెదరు గాదె నిజంబది యెల్లరీతులణ.

భక్తినమ్రత సూర్యభగవాను నర్చింపఁ
బ్రొద్దుతోఁదిరిగెడు పుష్పమొకటి
భానుమానుని కరస్పర్శనలోభాన
హర్షంబుఁజూపెడు నంబుజంబు
జాబిల్లిఁ బ్రేమించి చలికాంతిలోననే
కన్విచ్చు కలువలకన్నె యొకతె
పద యాతాయాత పాదముల్ గని మ్రొక్కి
యతిథిపూజలుసేయు హస్తభక్తి

శాస్త్రజిజ్ఞాసులకు రహస్యములఁ దెలుప
ననమ కవిరాజకుంజరాల్ హర్షమంద
శాస్త్రపటిమకుఁ గళకును స్థానమైన
నాటి ఋతుకాంత కులుకుచు నవ్వునవ్వె.



## హేమంతము

దినము హ్రస్వమ్మయ్యె - దీర్ఘమయ్యెనురేయి
బ్రాహ్మవేళను మంచువానగురిసె
సస్యాళి బిడ్డలఁ జంకననిడుకొనెఁ
దలపైన కుసుమముల్ దాల్చె లోధ్ర
క్రొంజివురుదొడిగెఁ గొన్ని వృక్షంబులు
సౌఖ్యమియ్యదు నేటి చంద్రకాంతి
అగ్నియు నాహుతి సమితంబుగాఁ గోరె
నంతకంతకు క్షుధ యధికమయ్యె
వేకువనె లేచి శీతలభీతిలేక
సంధ్యదీర్చెడు శుచి బ్రహ్మచారివోలె
వహ్ని చలిమంటలందునఁ బ్రజ్వలించె
తెల్లవారక హేమంత దినములందు

ఘన గంగ భూమినిఁ గలయవచ్చినయట్లు
నీహార మవనినన్నిధికిఁ జేరె
మంచుతాకిడికి రుగ్మతఁ జెందినట్టులఁ
బద్మాళి క్రమముగా వాడిపోయె
అగ్నిదేవునకు మాంద్యంబు వాపుట కట్లు
బాటలఁ జలిమంటలాటలాడె
జగమున కొక పెద్ద చలిమంటలాగున
భానుండు తూర్పునఁ బ్రభవమందె

తెల్లవారినఁగూడ భీతిల్లకుండి
దినకరునిఁ జూచి మొగమును దించుకొనక
నల్లకలువలు దర్పాన నవ్వుచుండెఁ
దరుణ హేమంత సుప్రభాతంబునందు.

చలిచే దిక్కులు గడ్డగట్టినవి - విశ్వంబందుఁ బ్రాభాతకాం
తులు వెల్గొందినఁ బ్రాణికోటి తమ పాన్పుల్ వీడవింకన్, ధరా
లలనాకంఠ వినూత్నకాంతియుత హారంబందు ముత్తెంబులం
బలె శోభిల్లెఁ దుషారబిందువులు - హేమంతప్రభాతంబునన్-

ఇనుఁడును నిద్రలేచుటొకయించుక జాగిరమయ్యె, రాత్రి మూ
సిన తిమిరంపుద్వారములఁ జించి బయల్పడఁ బ్రాలుమాలెఁ బ్ర
ధ్వని జనులుం గవాటములఁ దీర్చి బిగించిరి - తెల్లవారినన్
బనులకు లేచిరారు - తమ నాయకుఁడెట్టులొ తాము నట్టులే.

మంచుదుప్పటి నాపాదమస్తకమును
గప్పి, యింకను నిద్ర మేల్కాంచలేదు
భానుఁడు - గృహంబులందును బాలబాలి
కాజనంబులు నిద్ర మేల్కాంచలేదు.

ఆ రమణీయనీల సుభగాభ్రవిరాజిత బ్రాహ్మవేళలన్
భారత పూర్వకర్మ పరిబద్ధమనస్కులు గుంపుగూడి, నం
సారవిరాజమానమగు శ్యామలకోమల మందగామి, కృ
ష్ణారమణీయ శీతలవిశాల జలంబులఁ గ్రుంకి రెంతయున్.

అబ్దమున కర్థరాత్రమత్యంత నిశ్చ
లముగ జీవులు నిద్రించు సమయమదియ -
పంచభూతంబులఁ బ్రకృతి పంచుకొనుచుఁ
దన నిషాదము తనలోనె దాచుచుండె.

పరిసరవస్తుసంచయము, పర్వతముల్, తరువుల్ తుషారశీ
కరవసనంబుచే మిగులఁ గప్పఁబడెన్ - గగనంబుచెమ్మయై
కురిసెను శీతలోత్తమ వికుంఠమహామృతబిందుధార లు
ర్వరపయినన్, వధూవరులరాగము వేగము గాఢమై చనన్.

మేఘముతోడి వర్షమును మించెను మేఘములేనిశీకరా
ఘోషము - నాటివర్షముతు నూర్మియుఁ దేలికయయ్యెఁగాని నే
డీ ఘనశీకరాంబువు సహింపఁగరానిది - త్వగ్విభేద బా
ధా ఘనతన్ సహించుటకుఁ దాళరు మానవులెంతమాత్రమున్.

అదియ హేమంతకాల దినాంతమవనిఁ
ద్వరితగతి నావరించె సపారహిమము,
అగ్నిహోత్రుఁడు మాంద్యంబునందు కతన
దినకరుఁడు వడి మొగమున దీటువాసె.

జగతిఁ గురియు చకోర భోజన పయస్సు
హిమజలమిళితమై రుచిహీనమయ్యెఁ
బూర్ణిమా కౌముదీ రసపూర్ణయయ్యు
సితునన్ రాత్రి తుహినదూషితమయయ్యె.

పావకుని వేడిలేమి సుప్తంబులయ్యె
జీవకోటులు - సృష్టియు సేదదీరి
కొంతతడవును విశ్రాంతిగొనుటకెమొ
ప్రకృతి యమిత నిశ్శబ్దభావము వహించె.

అక్షేప సంహృతుఁడ నలుండు నిద్రలో
నతి సూక్ష్మరూపుఁడై యణఁగియుండె,
నది కారణంబుగ నఖిలలోకంబులు
శీతతనంది యచేతనంబు

## హేమంతము

లయ్యో - నయ్యెడఁ బ్రాణులా చలికోర్వక
నాచ్ఛాదనాతిశయంబునంది
నిద్రేచ్ఛలో మున్గె - నిశవాని కనుగుబ
ముగ దీప్తమౌటను భూతలంబు

హిమకణమువోలెఁ దోచెను - సృష్టియట్టు
లహరహంబును గృశియించి యువలభూత
వంచకంబు నిషిదమౌవడువుఁ జూచి
ప్రాణులన్నియు గజగజవణకిపోయె.

అట్లె లోకముల్ నిదురించె - సంతత కాల
చక్రము ప్రమత్తతతోన సంచరించె
నబ్దమున నిశయౌ దక్షిణాయనంబ
హమునఁ గల సాంధ్యరాగాల నాహరించె.

తొలిఁగల వన్నెలిప్పు హిమదూషితమైన సమానవాడు తాఁ
జలివెలుఁగేగి భానునకు స్వస్థితిఁ దెల్పఁగఁ గర్మసాక్షి "నా
వెలుఁగులుగూడ తగ్గెఁ గనుపింపదె? - నీకును నాకు నీ వెలుం
గుల నిడువాఁడు నిద్దురను గొల్పెను సర్వము" నంచుఁ బల్కెడిన్.

నల్లని పట్టుచీర - నయనంబుల నల్లని యంజనంబుతో
నల్లని కుంతలంబుల ననంత విరాజిత తారకాగ్రహో
త్ఫుల్లక మల్లికాప్రసవభూషితయైనది కృష్ణపక్షమం
దల్లదె శర్వరీ మహిళ - యందఱ శీతలవార్ధి ముంచుచున్.

కన్నులు చీకటుల్ గొలుపు కాంతుల వెల్గెడురాత్రి మాత, భా
గ్యోన్నతసృష్టి సంతతుల నొక్కయెడన్ శ్రమఁదీర్ప శాంతినం
పన్నతకోసమై యణువిభాగదశన్ గొని జోలబాడుకొం
చున్నది - సర్వమప్పట ననూహ్యవశం గొని విశ్రమింపఁగన్.

అదియ చీకటి - దురవ గాహంబు జీవ
కోటికి, నతీంద్రియజ్ఞానగోచరమగు
నఖిల మాతృక - యహరాగమమ్ము సందు
నర్వమును బ్రసవించెడి శక్తియదియె.

దాని మహిమంబు గన్గొన మానవునకు
నలవిగాదు - మహాత్ములైన ఋషులు
కౌశికాదులు దానిని గాంతురట్టి
స్థితిని దర్శించి హర్షానఁ దిరుగుచుంద్రు.

ఆరయ బ్రహ్మాండ దర్పణమైన యట్టి
గగనమండల మెంత నిష్కలుషమగునొ
వినుతులగు నిత్యసూరుల పేరులేమొ
తారకలెదోచె మింట నిస్తంద్రలౌచు.

ఆదిశ సుప్తనిభ ప్రపంచమునకున్ వ్యాఖ్యాతలౌ శూన్య వృ
క్షాదుల్ పూర్వము మట్టియాకుపయినన్ శాంతంబుగాఁ దేలునా
వేదాధీశ శిశున్ భవప్రభవు జ్ఞప్తింజేసె - సృష్ట్యాగమ
ప్రాదుర్భావతగల్గునా యచల విశ్రాంత ప్రపంచంబునన్.

జిల్లుమనితాకు నత్యంత శీతలమున
బ్రాహ్మవేళను భూపాల భావమంది
పవనరూపులై యెవర హొ పాడుచుందు!
రింతవేకువ మేల్కాంచి రెవరువారు?

వారె కాఁబోలు నప్తర్షులౌర! ఈ జ
గముల గర్భగతముఁజేసి కదలకున్న
యఖిలసృష్టి గ్రసిష్ణుని నాహుతులను
బిలచుచున్నారు సామసూక్తులను బాడి.

యోగనిద్రా నిమగ్నుఁడై యుండుకతన
యజ్ఞపూరుషునాననమందు నిమిడె
నగ్నిహోత్రుఁడు - వాని వక్త్రాబ్జవికస
నార్థులై సల్పుచున్నారు ప్రార్థనముల.

ఐనన్ జీవులు నిద్రలేవ వదియేమా కారణంబన్న ''నీ
శానుండాయనలుండు డాగె నెటనో చల్లారునేమోసుమీ!
వానిం బ్రార్ధనసేసి మేలుకొనఁ బిల్వన్ లోకమా మూలమై
తానే మేల్కొనునం''చు నా ఋషులు స్తోత్రాళిం బ్రబోధించిరో.

బ్రాహ్మవేళను లేచిన బ్రహ్మచారి
సాంధ్యకృత్యాన నిశ్చల జపముతోడ
నమిత శుచియౌచుఁ జదువు మంత్రాళితోడ
నగ్నిదేవుని మేల్కొల్ప నర్చసేసె.

ఆ యా వేళల గార్హపత్యమును భార్యాభర్తలుంగొల్చిరా
ప్యాయంబొప్పఁగ - వ్రేడులావులకు నాహారంబు చేకూర్చి ''యా
ప్యాయధ్వ''మ్మని యఘ్నియంబులకడన్ బాల్పిందు పూర్వంబె భ
క్త్యాయత్తంబుగ గోష్ఠిలో మెలఁగిరాహ్లాదాంతరంగంబులన్.

అంతట గోపికాజన సహస్రము వేకువ నిద్రలేచి, భాం
డాంతరమందు నిశ్చలతనున్న దధిన్ మధనంబొనల్పి, భా
స్వంతుని యుష్ణవీక్షణ ప్రసాదము వారి ఘటంబులందు నొ
క్కింతయొసంగి యాజ్యమును నీయఁగఁ బాడిరి మేలుకొల్పులన్.

హరినామకీర్తనామృత
పరుఁడై యరుణవసనములఁ బర్వెత్తెడి యా
హరిదాసువోలె నరుణుఁడు
బఱతెంచెను మేలుకొలుపుఁ బాడుచు వెడ్కన్.

అందఱు నన్నిరూపుల ననంత వినిశ్చల భక్తిఁగొల్వఁగా
మందత కొంతవీడి ఋషిమాన్యుఁడు నిద్దురలేచి నవ్వినన్
పందసమాచరించి నయనంబుల విచ్చినదెల్ల లోకమా
సంద పయోబ్ధిఁ దేలినది నాఁటనె నూతనసృష్టివెల్వడన్.



## శిశిరము

గుమ్మముల గొబ్బిముగ్గులఁ గూర్చికొనఁగఁ
బళ్లెరముతోడ ధేనువు పంచకరుగు
నాంధ్రబాలికయట్లు ప్రత్యక్షమయ్యె
భవ్యసుస్మితవదన ప్రాభాతకన్య.

నొనటం దిలకముదిద్దెను
మిసిమిగలుగు చివురువలువ మేనందాల్చెన్
ముసిముసి నగు దొంతరలను
వినరె నుషాకన్యక కనువిందులుగూర్చన్.

తొలుదొల్త వెలుగు విద్యోతమైనది యుషః
కామినీ ముఖ ఫలకంబువోలె
నరుణిమ యంతంత నధికమై యా కన్నె
చిరునవ్వు దొంతరల్ చిలుకరించె
వెలుఁగున వర్ణముల్ వెలువడె నా ముగ్ధ
కట్టిన జిలుగుల పుట్టమటుల
ముగ్ధలోకములెల్ల మోహింపఁజేసెను
దన తనూకాంతి విస్తారమంద

కన్నెయనుటెగాని కన్నెగాదా కాంత
దినము దినము లయము నొనరఁజేసి
మగుడ నినునిఁగూడ మరిమరిసృష్టించు
దేవమాత - యదితి - దివ్యచరిత.

దేశమునందు స్త్రీలు సుమదీప్తుల నంజలిపట్టిరా ధను
ర్మాసపులక్ష్మికిన్, విరులు మంగళహస్తములెత్తి రోజు బ్రా
హ్మసమయంబునందు మితిమీరిన భక్తినిఁబూజసేసి, యు
ల్లాసముతోఁ దుషారపు జలంబుల నిచ్చిన దర్ఘ్యపాద్యముల్

పసుపు కుంకుమ రంగవల్లికలఁ దీర్పఁగన్న
విందుగొల్పెడి ద్వారబంధమందు
ద్వారబంధంబులఁ దనరారు పచ్చని
మామిడికొమ్మలమాలలందు
"రంగవల్లులఁ ద్రొక్కరాదారలోదంచుఁ
బిల్లలతోఁ బల్కు తల్లులందు
ఘృతసంప్లుతములుగ గృహలక్ష్మి వండిన
భక్ష్యాల కమ్మని వలపులందు
కలువకొలఁకులయందున్న కమ్మకమ్మ
పరిమళముఁ దెచ్చు ప్రత్యూషపవనమందు
వివిధచిత్రరూపంబుల వెలయుచుండె
మహిత మంగళాంకిత ధనుర్మాసలక్ష్మి.

ఆకులురాలె భూజముల కొంతకుపంక్తికిఁ దీవ్రమైన ని
ష్ఠాకలితాంగులై తరులు సంపదత్యాగమొనర్చె - లోకమం
దాకులపాటుఁ దీర్చుటకునై యదె కంకణబద్ధమైన హేం
దాకనొ తాళనేల? వసుధన్ మధుకాలము దాపురించెడిన్.

నేలనొక్కెడఁ బల్లుశక్లేసూరకొనియు
బాధముల మ్రింగి కన్నీరు బయల్పఱచు
శీర్ణ విద్యానగరరాజ్య శిలలభంగి
మోడు లిప్పుడు జాలి చూపుల వెల్లార్చెను.

పరులు నిర్లక్షింపఁ దిరిపెమెత్తెడు వృద్ధు
పాడిన దీర్ఘమౌ పాటవోలె
పాంథ పాదాహతి బాధింప వెట్టిగాఁ
బూయనేర్చిన గడ్డిపూవువోలె
వయసునఁ బెద్దలు పాటింపకుండని
సుకుమారబాలకు సూక్తివోలె
యువకసంతతి మెచ్చకుండిన వృద్ధుని
భావగర్భితమైన పలుకువోలె

చూచుటకు సొంపులేకయుఁ జూడఁదగిన
నాటి మోడుమ్రాఁకుల రూపు మేటికవులఁ
దృప్తులంజేసె, మధుమాస దీప్తి తనదు
గర్భమున మాటుకొనియున్న కారణమున.

కమలబంధుఁడు తిమిరరాక్షసులఁ జీల్చి
రక్తసిక్తాంగుఁడై సముద్రంబునందు
స్నానమొనరించి తళుకులమేనితోడఁ
దూర్పుకొండను మ్రోయించె దుందుభులను.

అన్నిదిక్కులందు వినతమగుచు నీల
వాకసము భూమిఁ గలసిన యట్టి చోటు -
అట్టి వినతగర్భమునందుఁ బుట్టినాఁడు
పైడిఱెక్కల వేలుపుభానుఁడౌచు

అతఁడె సువర్ణపక్షుఁడు - మహత్తరతేజోనిధు - పూర్వగర్భసం
గతుఁడయినదాని యా ఋషులు గానము సేయఁగ మేలుకొంచి సం
గతుఁడగు దేవునికై నయముగాఁ దనమూపునఁ బైడిఱెక్కలం
దతిశయమొప్పమోపికొని యుల్లసిల్లఁబరచ్చుచున్నాఁడే దూర్పునన్.

గరుడవాహనారూఢుఁడై కదలివచ్చి
విశ్వదర్శనమొసఁగెడు వేళయందుఁ
బూని ముక్కోటిదేవతల్ వానిఁగొలిచి
చయనసూక్తుల గానంబు సలిపి రపుడు,

ఆ తరుణంబునందు జగమంతయుఁ జేతులుమోడ్చి మ్రొక్కి సం
ప్రీతినిగొల్వఁగాఁ బులకరించెను ధారుణిదేహమప్పటన్
శీతలబాధ వాసి వికసించెను, భక్తియు నెంతొ తీక్ష్ణమై
యా తరుణీ శరీరమున హర్షపుటంకురముల్ జనింపగన్.

పున్నెము కల్గుటే యఘము పోవుట యన్నటులన్ బ్రవాళ సం
పన్నతగల్గుపూర్వమ ద్రుమంబుల ప్రాణలవంబు నిద్ర మే
ల్కొన్న క్షణంబె వాడి యిలకుం దిగిపోయెను జీర్ణపర్ణముల్
నిన్నటి యాకులే యఘము నేటికిఁ గ్రొంజివురింపుఁ జూపినన్,

పూర్వము హ్రస్వమైన దినముల్ క్రమవృద్ధినిఁ జెందె, రాత్రులున్
బూర్వముకన్న హ్రస్వమయిపోవఁ గ్రమంబుగ నుత్తరాయణం
బుర్వరపైన నీ గతిని నుద్భవమై క్రమవృద్ధిఁజెందగా
నర్వవిధంబులన్ వెలుగుసాగెను చీకటి సన్నగిల్లగన్,

చెఱకుల్ పండియనన్యమాధురిని భాసిల్లెం బలిష్ఠమ్ములై
కఱవుల్ దీరఁగ వడ్లుపండె వసుధాకాంతా ప్రసూతంబునన్
మెఱసెన్ లోకము సవ్యగౌరవసమృద్ధ్యంబుచేఁ బ్రాణులం
దఱు నుత్సాహమునం జరించిర్ప్రబుద్ధరక్షైన లోకంబునన్,

అభ్యంజనానంతరాయత్తతిలక మ
ల్లెలమావి క్రొంజివురింపుఁ జూపె
మావికొమ్మను నిల్చి మాగధంబును గొంతు
సవరించెఁ బ్రభురాకనన్నుగాంచి